# జ్ఞాన ప్రభ



సమర్పణ :

భాగవతి రామమోహనరావు



ప్రకాశకులు :

జ్ఞాన వికాస్ పబ్లికేషన్సు
210-3. ఆర్. టి. విజయనగర్ కాలనీ
హైదరాబాదు
1987

# గురుస్తోత్రం

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః.

చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం
నాదబిందు కళాతీతం తస్మై శ్రీ గురవేనమః.

అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

నిత్యం శుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనమ్
నిత్యబోధం చిదానందం గురుం బ్రహ్మ సమామ్యహమ్ ॥

# ప్రార్థన

చిదంశం విభుం నిర్మలం నిర్వికల్పం
నిరీహం నిరాకార మోంకార గమ్యమ్
గుణాతీత మవ్యక్త మేకం తురీయం
పరం బ్రహ్మ యం వేద తస్మై నమస్తే॥

విశుద్ధం శివం శాంత మాద్యంత శూన్యం
జగజ్జీవనం జ్యోతి రానందరూపమ్
అదిగ్దేశ కాల వ్యవచ్ఛేదనీయం
త్రయీ వక్తి యం వేద తస్మై నమస్తే॥

నమో విశ్వకర్త్రే నమో విశ్వ హర్త్రే
నమో విశ్వభోక్త్రే నమో విశ్వమాత్రే
నమో విశ్వనేత్రే నమో విశ్వజేత్రే
నమో విశ్వపిత్రే నమో విశ్వమాత్రే॥

నమస్తే నమస్తే సమస్త ప్రపంచ
ప్రభోగ ప్రయోగ ప్రమాణ ప్రవీణ।
మదీయం మన స్త్వత్పదద్వంద్వ సేవాం
విధాతుం ప్రవృత్తం సుచైతన్య సిద్ధ్యై॥

(శ్రీశంకర భగవత్పాద విరచిత స్తోత్రముల నుండి)

# ప్రస్తావన

"బ్రహ్మ సత్యం జగన్మిథ్య" అనునది మన ఆధ్యాత్మిక తత్వసారాంశమై యున్నది. ప్రపంచ మసత్యమై స్వప్నమువలెనే కల్పితమైనదేయని, ఉన్నది సత్య స్వరూపమైన బ్రహ్మ మొక్కటేయని ఉద్ఘాటించు సర్వోత్కృష్టమగు ఇట్టి అధ్యాత్మిక తత్వము, ప్రపంచమందే మతముల యందునూ కానరాదు. సర్వోత్తమము, సర్వాధిక్యము, యదార్థము అగు ఈ పరతత్వ ప్రబోధమువల్లనే భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతి ప్రపంచ మందన్ని ఆధ్యాత్మిక సంస్కృతుల కన్నను ఉత్కృష్టమై, మార్గదర్శికముగ అలరారుచున్నదనుట అతిశయోక్తికాదు.

ఈ పరబ్రహ్మ తత్త్వము సామాన్య మానవాళికి అర్థము కాని అనూహ్యమైన తత్త్వము. ఈ మహత్తత్త్వము అవగాహన చేసికొను మానవోత్తము లెంతో అరుదుగానుందురు. ఏ జ్ఞానము కలిగిన ఇక తెలిసికొ వలసినదేదియూ మిగిలి యుండదో అదియే యీ తత్త్వమై యున్నది.

కంటికి కనిపించుచున్న ప్రపంచము అసత్యమైనది, లేనిది అని చెప్పిన ఎవరు నమ్ముదురు.? జాగ్రదావస్థ Wakeful state) స్వప్నమువలె కల్పితమై నిజముగా లేనిదే యనిన ఎవరికి అవగాహన కాగలదు? మనకు నిజముగా కర్తృత్వ భోక్తృత్వములు లేవనిన ఎంత ఆశ్చర్యము కలుగును? ఈ పరతత్త్వము మనోబుధ్యతీతము. సూక్ష్మాతి సూక్ష్మము. దీనిని వర్ణింపనలవిగాక వేదమాత సయితము మూకీభావము వహించె నని తత్త్వవేత్తలనుచుందురు. శ్రీ శంకర భగవత్పాదులు, "ఆత్మబోధ"లో ఈతత్త్వము నిట్లు వివరించిరి :—

సంసారః స్వప్న తుల్యోహి
రాగ ద్వేషాది సంకులః
స్వకాలే సత్యవద్భాతి
ప్రబోధే సత్యవద్భవేత్॥

అనగా, రాగ ద్వేషాదులు, సుఖ దుఃఖములు మున్నగు వానితో నిండియున్న ప్రపంచము ఒక స్వప్నమువంటిది. ఎంత కాలము మానవుడు అజ్ఞానముతో నుండునో, అంతకాలము ప్రపంచము యదార్థమైనదిగా గోచరించుచుండును. కాని జ్ఞానోదయమైన వెంటనే, అసత్యమైనదై స్వప్నమువలె మిథ్యయై అదృశ్య మగును.

జ్ఞానము ప్రపంచపు యదార్థ స్థితిని వ్యక్తపరచును. పంచ భూతాది ఆత్మేతర వస్తుజాతమును నిషేధింపగా ఏ పూర్ణాత్మయగు సత్ చిదానందము మిగులునో, అదియే తానని యెరుగుటయే జ్ఞానమై యున్నది. అట్టి జ్ఞానికి తనకంటె నన్యము అగు ద్వితీయ వస్తువు గోచరించదు. ఈ తత్త్వ జ్ఞాన సాధనాంశము, కొందరు మహనీయుల ప్రబోధముల ననుసరించి, ఈ చిన్న గ్రంథమునందు సమర్పించడమైనది. గురుకృపా కటాక్షములచేతను, సాధు సజ్జనుల ప్రోత్సాహము వల్లను జ్ఞాన వికాస్ ప్రచురణలు మరికొన్ని వెలువడుట సాధ్యమగునని ఆశించుచున్నాము.

హైదరాబాదు
1-12-87

ఇట్లు
ప్రకాశకులు

# విషయ సూచిక

ఓమ్

# జ్ఞాన ప్రభ

## మొదటి అధ్యాయము

## కర్తవ్య ప్రకరణము

**జ్ఞానమే దైవస్వరూపము :**

ప్రాపంచిక విషయములలో ఎంతటి ఘనుడైన వాడైనను, తానెవరో తెలియనివాడై, అజ్ఞానమయ జీవితమునే గడిపివేయుచున్నాడు. చదువులెన్ని చదివినను, ధనమెంత ఆర్జించినను, పదవులెన్ని అలంకరించినను, తానెవరో, తన నిజస్వరూపమేదో తెలుసుకొనుటకు యత్నింపనివాని జీవితము నిస్సారమై, చివరకు నిరర్థకమే అగుచున్నది. తానెవరో తెలిసికొనవలెనని చిత్తశుద్ధితో ప్రయత్నము చేయువాడే తెలివైనవాడు. నిజమైన దైవభక్తుడు, తానెవరో తెలిసికొనుటయే భగవంతుని తెలిసికొనుట,

భగవత్తత్త్వమెట్టిదో తెలిసికొనుటయే మనుష్యుని కర్తవ్యమైయున్నది. భగవత్తత్త్వము నెరుగడమే జ్ఞానము. అట్టి జ్ఞానముతో చేయు ప్రార్థనయే దైవ ప్రార్థన కాగలదు. జ్ఞానముతో చేయు ధ్యానమే భగవధ్యానమగును. జ్ఞాన పుష్పములతో భగవంతుని అర్చించుటయే నిజమైన దేవార్చన.

భగవత్తత్త్వ మెట్టిదో తెలియని అయోమయపు స్థితిలో చేయు ధ్యానము భగవధ్యాన మెట్లగును? అట్టి స్థితిలోనే చేయు ప్రార్థనలు, పూజలు మొదలగునవి అర్థహీనములైన కార్యకలాపములై నిష్ప్రయోజనములే యగుచున్నవి. ఎన్ని దేవాలయములను దర్శించినను, తీర్థయాత్రలు చేసినను, పూజలు, జపములు, భజనలు, దానములు, యజ్ఞయాగములు ఎంతకాలము ఎన్నెన్ని చేసినను అజ్ఞానమును తొలగించుకొనుట అసంభవమే యగుచున్నది. అజ్ఞానమును తొలగించుకొను సాధనయే నిజమైన ఆధ్యాత్మిక సాధన కాగలదు. వేరు సాధనలన్నియూ, అర్థరహితములైన వ్యర్థ కార్యకలాపములే అగుచున్నవి.

సూర్యుడుదయించిన తోడనే చీకటి తొలగిపోవునట్లు జ్ఞానోదయమైన వెంటనే అజ్ఞానము సర్వమూ పటాపంచలగునని ఆదిశంకరుల ఆత్మబోధలో చెప్పబడిన సారాంశము.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి॥

(భగవద్గీత అ॥ 4 శ్లో॥ 38)

అనగా జ్ఞానము కంటె పవిత్రమైన దేదియును లేదు. ఆత్మ జ్ఞానమును అనుభవ పూర్వకముగా పొందుటయే అన్ని యోగ సాధనల యొక్క పరమ లక్ష్యమై యున్నది.

"కురుతే గంగా సాగర గమనం
వ్రతపరిపాలన మథవాదానం
జ్ఞానవిహీన స్సర్వమతేన
ముక్తిం నభజతి జన్మ శతేన॥

అనునది ఆదిశంకరుల మోహముద్గరలో కాననగును. అనగా జ్ఞానము పొందనిదే, గంగానదుల యందుగాని, సముద్రములలో గాని ఎన్ని స్నానములు చేసినను, వ్రతములు, దానములు, ఎన్నెన్ని చేసినను, నూరు జన్మలకైనను ఏ మతము చేతను ముక్తిని పొందుట దుర్లభము.

జ్ఞాన స్వరూపమే దైవ స్వరూపము. జ్ఞానమూ దైవము ఆ విధముగా ఒకటియే. తానెవరో, తననిజస్వరూపమేదో తెలిసికొను విచార సాధనము వలన సత్వరముగ జ్ఞానము సిద్ధింప గలదని సిద్ధపురుషుల ఆదేశమై యున్నది. తన నిజస్వరూప మేదో తెలిసికొనవలెననెడి జిజ్ఞాస కలుగుటయే మనుష్యునకు అదృష చిహ్నము, భగవదనుగ్రహము లేనిదే ఏ మానవునకూ అట్టి ప్రవృత్తి కలుగదని శాస్త్రములు చాటుచున్నవి.

**అవివేకము - వివేకము:**

మన చుట్టూ జంతువులు, పక్షులు, జలచరములు, కీటక ములు, చెట్లు మొదలగు ఎన్నో రకముల స్థావర జంగమ రూప భూతములతో ప్రపంచము సాగుచున్నది, ఎనుబది నాలుగు లక్షలుగాగల ఇంతటి పలువిధ జీవరాసులలో, మానవ జన్మము

ప్రాప్తించుట ఎంతో అదృష్టమనుట నిస్సందేహము. సృష్టిలో సర్వోత్కృష్టమగు మనుష్య శరీరము ప్రాప్తించుటవలన, వస్తు వివేచన చేయుటకు, ఏది నిత్యమో, ఏది అనిత్యమో వివేకముతో నిర్ణయించుకొనుటకు అవకాశము కలిగినది. పశు, పక్షి మృగాదులగు ఇతర జీవరాసుల యందిట్టి విజ్ఞానము శూన్యము. మానవునియందే నిత్యానిత్య పరిశీలన చేయగల ప్రవృత్తికలదు. భగవత్ సృష్టిలో, ఇంతటి ఉత్కృష్టము, దుర్లభము, అయిన మనుష్య జన్మమను మహదవకాశమును పొందియు, తానెవరో, తన నిజస్వరూపమేదో తెలుసుకొనుటకు, ఎట్టి ప్రయత్నము చేయక, అనిత్యమైన ప్రాపంచిక విషయములతోనే జీవిత కాలమంతయు గడిపివేయు ప్రవృత్తియే అవివేకమనబడు చున్నది.

> దుర్లభం త్రయమే వైతద్దేవానుగ్రహ హేతుకం
> మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుష సంశ్రయః।

అనగా, మనుష్యజన్మ, మోక్షాసక్తి, మహాపురుష సాంగత్యము దుర్లభమైనవని, భగవదనుగ్రహము వలనగాని అవి లభించునవి గావని, ఆదిశంకరుల వివేకచూడామణిలో, గననగును. ఆధ్యాత్మిక సాధనము చేయనిదే, జీవితము మానవ జీవితము కాజాలదని గ్రహించెడివారు అరుదుగా నుందురు. సత్యవస్తు పరిశోధనమే మానవ ధర్మమని, ఆధ్యాత్మికసాధనమే జీవితమునకు ముఖ్యకర్తవ్యమని తెలుసుకొనినవారే ధన్యజీవులు.

మానవోత్తములు. ఆధ్యాత్మిక సాధనచేయని జీవితము మానవ జీవితము కానేరదు. కేవలము పశు పక్ష్యాదులు చేయుపనులే జేయుచు గడుపు జీవితము మానవ జీవితమెట్లగును? అది ద్విపాదపశు జీవితమే కాగలదు.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధశే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తిత త్త్వతః॥

వేలకొలది మానవులలో ఒకానొకడు పూర్వ జన్మ సుకృత పరిపాకము వలన సత్యాన్వేషణ చేయుటకు మోక్షాసక్తుడై ప్రయత్నించుచున్నాడు. అట్టి ప్రయత్నము చేయు ముముక్షువులలో ఒకానొకడు నన్ను భగవానుని తెలుసుకొనుచున్నాడు. అనగా బ్రహ్మ స్వరూపమే తన నిజస్వరూపమను జ్ఞానము కలవాడగుచున్నాడని శ్రీకృష్ణునిచే అర్జునకు భగవద్గీతలో చెప్పబడినది.

చర్మము, మాంసము, రక్తము, నరములు, ఎముకలు, మలమూత్రములు, మున్నగు జడ పదార్థ సముదాయకమగు ఈ శరీరము జాగ్రదావస్థలోనే గోచరించుచున్నది. ఇట్టి జడమయమగు దేహము అనిత్యమై కొంత కాలమే ఉండునదని, తాను ఈ శరీరమును గురించియు, ప్రపంచమును గూర్చియు ఏమీ తెలియని అజ్ఞాన స్థితిలో నుంటినని గ్రహించుకొని, ఈ శరీరము తానెంత మాత్రము కాననెడి భావోదయము పొందుటయే వివేకము. ఇట్లు, అజ్ఞాన కారణమగు దేహాభిమానమును విస్మ

రించుచు "ఈ శరీరము నేను కాదు. నేను నిరాకార నిర్మలాత్మ స్వరూపుడను" అనుకొను తన నిజస్వరూప భావమును పొందుటయే జ్ఞానము.

మనకు గోచరించుచున్నవి దేహము, లోకము. ఇవి జాగ్రదావస్థయందు మాత్రమే గోచరించుచున్నవి. స్వప్న సుషుప్తావస్థలలో అంతర్థానమగుచున్నవి. నిద్రానంతరము ఒడలు విరుచుకొనుచు మెలకువ తెచ్చుకొని లేచుచున్నాము. ఈ మెలకువయే జాగ్రదావస్థ యనబడుచున్నది. జాగ్రదావస్థ ఒక కృత్రిమ తెలివియై, దేహభ్రాంతి (animation)కి, అసత్యమైన ప్రపంచకపు దృష్టికి, కారణమగుచున్నది. ఈ మెలకువ నిజమైన మెలకువకానేరదు. ఈ తెలివి యదార్థమైన తెలివి కానేకాదు. ఏలయన, ఈ తెలివి వలన, జాగ్రదావస్థలో శరీరమే నేననుకొను కృత్రిమ అసత్యపు భావము ఉదయించి, దేహభ్రాంతితో తగుల్కొనుచున్నాము. దేహమే నేననుకొను భ్రాంతి భావముతో శబ్ద, స్పర్శ, రూప. రస, గంధములగు పంచేంద్రియముల ఉనికిని గ్రహించుట, ప్రపంచమను మాయ కలాపము గోచరించుట జరుగుచున్నవి. జాగ్రదావస్థలో కలిగిన తెలివి, గోచరించు జగత్తు, కృత్రిమమై, స్వప్న సమానమైనవని జ్ఞానముదయించినంతనే విదితమగుచున్నది.

స్వప్నకాలములో తనకు కలిగిన శరీరము వట్టి కల్పన అనీ, భ్రమ అనీ జాగ్రతలోనికి రాగానే ఎట్లు తెలిసిపోతున్నదో,

అట్లే జాగ్రత కూడ భ్రమేనని ఆత్మోన్నతి కలిగి జ్ఞాన స్థితి నందిన తక్షణమే తెలియగలదు.

దేహామునకు సంబంధించినదే లోకము. అనిత్యమైన దేహము నశించిన, ఆదేహికి ఇహ లోకము ఉండుట అసంభవము. అనగా, దేహమే నేను అనుకొనెడి దేహాత్మ బుద్ధివల్లనే లోకము గోచరించుచున్నది. దేహ లోకములు గోచరించుచుండుటతో, సత్యమైనది, నిత్యమైనది అయిన మన సహజ స్వరూపమగు ఆత్మను మరచుచున్నాము. స్వతః సిద్ధమై, స్వయం ప్రకాశమై ప్రత్యక్షముగ ఎల్లవేళల విలసిల్లు నామరూప రహితమైన మన నిజస్వరూపమగు ఆత్మ మనకు మరుగై ఆగోచర మగుచున్నది. దేహమునకు విలక్షణమై, నామరూపరహితమై, స్వతఃసిద్ధమై, ఆనందమయమై విలసిల్లు మనసహజ స్థితియైన ఆత్మస్వరూపమును పొందుటకు చేయు కృషియే జీవితములో సర్వోత్కృష్టమైన కర్తవ్యకార్యము. దీనికి మించిన శ్రేయోదాయకమైనదేదియునూ లేదు.

లేనటువంటి ప్రపంచము ఉన్నట్లు గోచరించుచుండుటయే మాయ. ప్రపంచము నిజముగా లేనిదేనని, స్వప్నతుల్యమైనదని, భ్రాంతివల్లనే గోచరించుచున్నదని, నిర్విరామయోచనవలనను, సాధనవల్లను, అనుభవపూర్వకముగ నిశ్చయించుకొనవచ్చును. అట్టి నిశ్చయము కలిగిన తరువాత, ఇక శేషించియుండునది భగవత్ స్వరూపమై, సర్వత్ర స్వతః సిద్ధముగా నిండి యుండి, మన నిజస్వరూపముగా భాసిల్లుట అనుభవమునకు వచ్చును.

అట్టి అనుభవతత్త్వమును పొందుటకు చేయు నిరంతర కృషియే యోగములలో సర్వోత్కృష్టమైన జ్ఞానయోగము.

ప్రతి జీవియూ సాక్షాద్భగవత్ స్వరూపమే. భగవత్ స్వరూపమే మన సహజ స్థితి. ఇంద్రియ గోచరములగు శరీర, అహంకారాదికములచే కప్పబడి, మన సహజస్వరూపము మనకు మరుగైనది. ఇది అనుభవ పూర్వకముగా తెలిసికొనుటయే ఉత్కృష్టమైన మానవ జన్మనకు ఉత్కృష్ట కర్తవ్యమైయున్నది. అహంకార జనితమైన భ్రమను తొలగించుకొని, తన నిజ స్వరూపమగు భగవత్ సాక్షాత్కారమును పొందుటయే మానవ జీవిత పరమావధి.

ఎవరి ముఖమును వారు చూచుకొనలేరు. అందువలన నాకు ముఖము లేదనుకొనుట హాస్యాస్పదము. కాని అద్దము సహాయముతో, ఎవరి ముఖమును వారు చూచుకొన గలుగుచున్నారు. జ్ఞానమను అద్దమును సంపాదించుకొనిన, సత్యానంద స్వరూపమగు పరమాత్మను నేనే అని తెలిసికొని, కృతార్థత పొందవచ్చును.

**పరమ కర్తవ్యము :**

సర్వోత్కృష్టము, అత్యుత్తమము అయిన ఈ నర జన్మము సార్థకము కావలెనన్న, దేహభ్రాంతిని తొలగించుకొని అత్యంత శ్రద్ధతో సత్యవస్తువును తెలుసుకొను ప్రయత్నము

చేయుట ఆవశ్యకము. శ్రద్ధాభక్తులెంత అధికతరముగా నుండిన అంత త్వరితముగా మనము చేయు ప్రయత్నములు ఫలవంత ములు కాగలవనుటలో సందేహములేదు. స్వస్వరూపానుభవ మైన, ఆత్మజ్ఞాన సంపాదనకై, అఖండ ఆవేదనతో, తీవ్రమైన సాధన చేసినగాని, దానిని పొందుట సాధ్యముకాదు.

సర్వ వేదాంతశాస్త్రములు, మహాపురుషుల ప్రవచనములు బోధించునదిదియే. ప్రాపంచిక విషయములనుండి, మనస్సును మరల్చి, ఆత్మచింతనయందే ఎక్కువ కాలము లగ్నము చేయు చుండిన, జ్ఞానమును పొందవచ్చును. సత్యాన్వేషణకై సతతము హృదయమున తహతహ, పరితాపము కలిగియుండుటయే సాధనకు తోడ్పడు భావము.

సత్ చిదానందమయమగు భగవత్ స్వరూపమే మన నిజస్వరూపమైయున్నది. దానిని ఆవరించుకొనియున్న అజ్ఞాన అహంకారములను వదలించుకొనిన, ఆ బ్రహ్మానుభవము సిద్ధిం చుటలో ఎట్టి సందేహమునకు తావులేదు

నిత్యానందమయమగు బ్రహ్మస్వరూపమే మన యదార్థ స్వరూపమని గ్రహించుకొని, దానిని మరుగుచేయుచున్న అజ్ఞా నమును పోగొట్టుకొనుటయే మానవ కర్తవ్యమని నిశ్చయ బుద్ధి కలిగినవారు అరుదుగా నుందురు. అట్టి వారిలో, భగవత్ సాక్షాత్కారము కొరకు, దీక్ష, పట్టుదల కలిగి సాధనచేయు

వారు అత్యంత అరుదు. అట్టి వారే ప్రపంచమందు అదృష్ట వంతులు; మానవోత్తములు.

గోచరించు సమస్త రూపములు భగవద్రూపములే. భగవంతుడుకాని దీసృష్టియందేదియునూ లేదు. ఈ ప్రత్యక్ష సత్యమును గ్రహించుటయే భగవంతుని పొందుట. అదియే మనకు పరమ కర్తవ్యము,



ఓమ్

# రెండవ అధ్యాయము

# అవరోధ ప్రకరణము

## అవరోధ నిర్మూలనమే సాధన

భగవత్ సాక్షాత్కారము అను పదము నిజముగా స్పష్టార్థ రహితమైనది. ఏలనన భగవంతుని కొరకు అన్వేషించుట తనను తాను అన్వేషించుకొనుటయే, భగవంతుని నేను తెలుసుకొనవలె ననుకొను సాధకుని భావము సరియైనది కాజాలదు. ఏలనన, సాధకుడైన తనకు భగవంతుడు అన్యుడుగాడు.

భగవంతుని ఎట్లైనను ఈ జన్మలోనే సాధించవలెనను పట్టుదలతో సాధన చేయబూను సాధకుడు, ముందుగా తనలో నున్న అపోహను పోగొట్టుకొనవలెను. భగవంతుడు సాధించ వలసిన అన్యుడెవరో కాదు. తానే భగవంతుడై ఉన్నాడు. తన చేతనే భ్రాంతిచే కల్పించబడిన అవరోధముల వలన. తన నిజ స్వరూపము, మేఘముల వెనుక సూర్యునివలె, మరుగైయున్నది. ఇది అనుభవ పూర్వకముగా గుర్తించుకొనుటయే సక్రమమైన సాధనా మార్గము కాగలదు. ఈమార్గము తెలుసుకొనిన సాధకునికి ఆత్మావరోధనల నిర్మూలనమే సాధనమగును. అనగా, అవరోధ

ములను పోగొట్టుకొనుటయే మన యథార్థ స్వరూపమైన భగవత్ స్వరూపమును ప్రకటితము చేసుకొనుట.

**అవరోధ వివరణము**

ఆత్మజ్ఞానమును పొందుటకుగల అవరోధములను, ప్రతిబంధకములను ముందు గుర్తించుకొనుట సాధకునకు అత్యంత శ్రేయస్కరము.

అన్ని అవరోధములకు మూలమైనది, ప్రథమమైనదీ అహంకారము. అహంకారము నుండియే అవరోధములన్నియు ఉత్పన్నములగుచున్నవి. కాని ఎల్లప్పుడు ముఖ్యముగా దృష్టిలోనుంచుకొనవలసిన అంశము ఒకటున్నది. స్వయం ప్రకాశ స్వరూపమగు ఆత్మకు, అవరోధములు, ప్రతిబంధకములు అజ్ఞాన జనితములగు ఆరోపితములై, యథార్థములు కానటువంటి మిథ్యా స్వరూపములేయని తెలిసికొనవలయును. అనగా అవి వదిలించుకోబడదగినవేగాని శాశ్వతముగా ఉండవలసినవికావు.

ఎవరి స్వరూపము వారికి అత్యంత ప్రియమైనది. అంతకంటె ప్రియతమమైనది వేరు లేదు. అంతటి ప్రియమైన స్వస్వరూపమును మరపించి, రక్త, మాంస,మల భూయిష్టమగు శరీరమే తన స్వరూపమని భ్రమజెందుచూ, ఇంద్రియ లోలత్వముతో వ్యవహరించు ప్రవృత్తియే అహంకారమనబడుచున్నది. ఇదియే దేహాత్మ బుద్ధి. అనగా దేహామే "నేను" అనుకొను తలంపు. దేహమునకు మాత్రమే పరిమితము చేసికొని ఇదే నేను

అనుకొనడమే ఇక్కడి అవరోధము. స్థూల శరీరమే నేననుకొను అసత్యమైన భావము జనించుట వలన, తనకు కుల, గోత్ర, నామ, రూప, గృహాస్థాశ్రమాది పలువిధ భ్రాంతులు కలుగు చున్నవి. ఈ కుత్సిత నామరూపాహంకారము, అన్ని ప్రతి బంధములకు మూలాధారమైయున్నది. అహంకారమునకు మారు పదమే "జీవుడు" అనబడుచున్నది.

అత్యంత ప్రియతమమైన మన నిజస్వరూపమగు ఆత్మను అహంకారము మరుగు చేయుచున్నది. ఈ అహంకార ప్రవృత్తిని ఆదిశంకరులు అవిద్యయని వివరించిరి. నిజముగా నేను కాని దేహమును "నేనే" అనుకొను భ్రాంతి జనితమైన భావనయే అవిద్య. తాను నిజముగా దేహేంద్రియాదుల కతీతుడై, చిదానంద స్వరూపుడై, అక్రియుడై వెలయు ఆత్మ స్వరూపుడైయున్నాడు. యథార్థముగా నామ రూపములులేని చిదానంద స్వరూపుడై వెలయుచున్నాడు. ఆ నిజస్వరూపమును గప్పిపుచ్చి, జడమయ మగు దేహేంద్రియాదులే యథార్థమైనట్లు తోపజేయు మిథ్యా భావమే అవిద్యకు మూలము. ఈ అవిద్యలో దగుల్కొనుటవల్లనే జాగ్రత్, స్వప్న, సుషుప్త్యావస్థలు గలిగిన జీవితమును భ్రాంతి లోదగుల్కొని, దేహేంద్రియాదులతో అనేక కష్ట సుఖముల ననుభవించుచున్నట్లు, భ్రమించుచుండుట జరుగుచున్నది. శరీరమందు మనకు గలిగిన ఈ "నేను" అను పరిమిత భావము వట్టి భ్రాంతియే కాని మరియొకటి కాదు.

"నేను నేన"ని భాసించు అహంకారము నిజముగా శరీర మునకు జెందినది కాదు. ఇది కొద్దిపాటి వివేచన వలన సులువుగా విదితము కాగలదు. ఏలయన, దేహము కేవలము జడపదార్థదాయకము. పాదములు మొదలు శిరస్సు పర్యంతము అన్వేషించి చూచిన చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, నరములు మున్నగు జడ పదార్థములే తప్ప నేను అనునది గోచరించదు. అట్టి శరీరమునకు అహంకారం బుద్ధియుండుటసంభవము. ఆత్మ 'నేను' నిర్వికార, నామరూపరహితమగు చైతన్య స్వరూపము. నామ రూపములు లేక, ఆకాశమువలె శూన్యమై సర్వమునూ తనయందు కలిగినదై వెలయు సత్య స్వరూపమగు ఆత్మకు "నేను" అనుతలంపు గలుగుటకు అవకాశమేలేదు. ఏలయన, దానికి ఒకే ఉనికి యనునది లేదుకదా! అటు శరీర మునకు, ఇటు ఆత్మ స్వరూపమునకు సంబంధించనిదైన, ఈ అహంకారము (పరిమితభావము) అవాంతరముగ తోచుచున్నది. వివేచనా విమర్శనల వలన, ఇది కేవలము భ్రాంతియే కాని యథార్థముకాదని గుర్తించుకొనవచ్చును. ఈ భ్రాంతి ఒక రకమైన స్వప్నము వంటిదని అనుకొనవచ్చును. నిరంతర సాధనచే ఈ భ్రాంతిని తొలగించుకొనినచో, మనము మన సహజస్వరూప దివ్యత్వములో భాసించుచుందుము.

పరమార్థము మన సహజ స్వభావము. స్వతః సిద్ధము. సులభ సాధ్యము. అది నామరూపములులేని చైతన్యము. అది మన సొత్తే ఐయున్నది, అట్టిదైన మన దివ్యత్వమును మనము మరచియున్నాము. నిజముగా మనకు ఎట్టి అవరోధము

గాని ప్రతి బంధకముగాని లేనేలేదు. ఈ ముఖ్య విషయమును సదాగుర్తుంచుకొనవలెను. ప్రత్యక్ష సత్యములైన ఈ విషయములయందు గట్టినమ్మకము కుదుర్చుకొనవలెను. వీనిని గ్రహించుకొనుటకు సావధాన చిత్తులమై సాధనచేయుట కంటె మించిన శరణోపాయములేదు. ఈ సాధనకు ముఖ్యాంశము: మనము మరచియున్న మన దివ్యత్వమును తిరిగి పొందుటకు, "నేను నేన"ని మనము సతతము తలంచుచుండు శరీరమును, నేనుకానని, వివేచనచే దృఢ నిశ్చయము కలిగియుండుట.

"నేను నేన"ని తోచెడి అహంకార బుద్ధి అవాంతరముగ తోచు భ్రాంతియేకాని, నిజమైనది కాదని గుర్తించితిమి. అందు వలన ఈ అహంకారము వలననే మనము గ్రహించెడి, మనకు గోచరించెడి, విషయ జాతమెల్లయూ, యథార్థమెట్లగును? భ్రాంతి వలననుత్పన్నమగు సమస్తమును మిథ్యయే యగును గాని యథార్థము కానేరదు.

అహంకార భ్రాంతి మనకు జాగ్రత్ స్వప్నావస్థలయందే కలుగుచున్నది. అది సుషుప్తావస్థ (గాఢనిద్ర యందు, మన యథార్థ స్వరూపమగు ఆత్మ స్థితియందు లయమొందుచూ, అదృశ్యమగుచున్నది. అహంకార భ్రాంతి వలన జాగ్రదావస్థ యందు గోచరించెడి ప్రపంచమంతయును స్వప్నమందలి విషయ వస్తు జాతమువలె, మిథ్యయే యగును. జాగ్రత్ స్వప్నావస్థల యందు మనకు గోచరించు సమస్త దృశ్యజాతమును, ఇంద్రియ

కార్య వికారములును, ఆరోపితములు తప్ప యథార్థములు కానేరవు. స్వప్నమునందు గోచరించెడి వస్తుజాతము, వస్తుభోగము యెట్లు మానసిక సృష్టియేకాని వాస్తవముకాదో, అట్లే జాగ్రదావస్థయందు గ్రహించెడి సమస్త విషయవస్తు గ్రహణ మున్నూ ఇంద్రియ వ్యాపారమేకాని, లేదా పరిమిత భావ జన్యమే గాని యథార్థము కానేరదు.

అహంకారమునకు ఆశ్రయమైనది దేహము. అజ్ఞాన జనిత మగు దేహమును, స్థూల, సూక్ష్మ కారణ శరీరములను 3 విభాగ ములుగా యోగ శాస్త్రము సూచించినది. పంచ భూతములనెడి పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశముల పంచీకరణముతో నుత్పన్నమగుచు, చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, నరములు మున్నగు జడ పదార్థముల సముదాయమై, మల మూత్రాదులతో నిండి, అహంకారియగు జీవునకు, స్థూల శరీరము, భోగసాధనమగు చున్నది. ఈ స్థూల దేహము, పుట్టుట ఉండుట, పెరుగుట, పండుట, తరుగుట, నశించుట, అను ఆరు ధర్మములు కలిగియున్నది. వీనినే షడ్భావ వికారములందురు. ఇవి గాక, కుల మత వర్ణాశ్రమాది సాంఘిక నియమములును, అనేక రోగముల బాధల అనుభవములును, ఇతరులచే గలుగు నిందాస్తులు మున్నగువన్నియు, స్థూల శరీర ధర్మములు.

స్థూల శరీరములోపల సూక్ష్మ శరీరముగలదు. దీనినే లింగ శరీరమనికూడ అందురు. సూక్ష్మ శరీరమునకు ముఖ్యాంగములు

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి పంచేంద్రియములు. ఇవి సాధకునకు బహుదుర్గమమగు అవరోధములు. విషయ చింతన వీనివలననే ఉత్పన్నమగు చుండును. విషయ చింతన విషయ వాసనల నుండి బయల్వెడును. ఇది దేహావాసన, లోక వాసన, శాస్త్రవాసన యను మూడు విధములుగా నున్నది. ఈ విషయ వాసన, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి విషయ పంచకముగా శాస్త్రములచే వివరింపబడినది. ఈ పంచేంద్రియములవలన ప్రతిఫలించునది కనుకనే, ప్రపంచమునకు ఆ పేరు కలిగినది. విషయములను గ్రహించెడి ఈ పంచేంద్రియములు, జ్ఞానేంద్రియము లనబడును. జ్ఞానేంద్రియముల ద్వారా గ్రహించెడి విషయములను బుద్ధి ఉత్తరువు ప్రకారము క్రియా రూపములుగా చేయునవి కర్మేంద్రియములు. ఇవి వాక్కు (మాట), పాణి (చేతులు-ఇచ్చిపుచ్చుకొను ప్రవృత్తి, పాదము కాళ్ళు గమనము), పాయువు (నిసర్గ-విసర్జన), ఉపస్థ (ఆనంద-కామక్రీడ).

సూక్ష్మ శరీరము ఇంద్రియ కూటము. సతతము, శబ్దాది పంచవిషయములచే ప్రేరేపింపబడుచు, ఇంద్రియములు మానవుని బంధించి, తన నిజస్వరూపమును మరుగుపరచి, అనిత్యమగు శరీరమే తాననెడి అహంకారమును విజృంభింప జేయుచుండును.

పంచేంద్రియ ప్రేరణకు మూలస్థానము అంతఃకరణము. ఈ అంతఃకరణము నాలుగు విధములుగా ప్రభాసించుచుండును.

అందుచే దీనిని అంతఃకరణ చతుష్టయమందురు. మనస్సుగా ఇది సంకల్ప వికల్పములను చేయుచుండును. బుద్ధిగా ప్రతి చర్యలను నిశ్చయించుచుండును. చిత్తముగా విషయములను స్మరించి చింతన చేయుచుండును. అహంకారముగా "నేను" "నాది" యనెడి అభిమానము గలిగియుండును.

స్థూల శరీరమందలి భాగములన్నియు ప్రాణ శక్తివలన చలించుచున్నవి. ఈ ప్రాణ శక్తి వాయురూపములో పంచ విధములుగా శరీరమంతటనూ వ్యాపించినదై, ఉచ్ఛ్వాస నిశ్వాసలకు, భోజనాది పదార్థములను పచనము చేయుటకు, మల మూత్ర విసర్జనము గావించుటకు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సకల వ్యాపారములకును ఆధారమై యున్నది. దీనినే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానమను ప్రాణాది వాయు పంచక మని అందురు.

పైన వివరించిన శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను గ్రహించు జ్ఞానేంద్రియములు, వాక్కు, పాణి, పాయువు, పాదము, ఉపస్థలను కర్మేంద్రియములు, పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశములగు పంచభూతములు, ప్రాణ, ఉపాణ, వ్యాన, ఉదాన, సమానములనెడి వాయు పంచకము, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారములగు అంతఃకరణ చతుష్టయము, అజ్ఞానము, కామము, కర్మము ఇవి అన్నియు కలసి సూక్ష్మ శరీరమై, ఆత్మ స్వరూపమునకు కల్పితావరోధములై,

ప్రపంచమును మాయా సృష్టిని జాగ్రదావస్థలో తోపజేయు చున్నవి. వీని వలననే స్వప్నావస్థ యందు స్వప్న ప్రపంచము సృష్టింప బడుచున్నది.

సూక్ష్మ శరీరముత్పన్న మగుటకు మూలమైనదే అవ్యక్త కరమగు మాయ. దీనినే కారణ శరీరమందురు. ఇదియే అనిర్వచనీయమైన ప్రకృతిశక్తి. సర్వ చరాచర ప్రపంచమునకు కారణభూతమైనది. మాయ, అవిద్య, అజ్ఞానము ఒకటే. ఈ మాయను సత్వ, రజ, స్తమో గుణములను మూడు తలలు గల సర్పముగా వర్ణింతురు. త్రిగుణాత్మకమైన ఈ మాయ ఆత్మస్వరూపమునకు మూలావరోధమై, ఆవరణ విక్షేప శక్తులను కల్పించి ఆత్మ స్వరూపమును మరుగు చేయుచున్నది. ఆవరణశక్తి వలన సర్వత్రా వ్యాపించియున్న సత్య వస్తువగు ఆత్మ తెలియదనుకొనెడి, లేదనుకొనెడి ప్రవృత్తి కలుగును. ఇంద్రియ గోచరములగు శరీర, ప్రపంచాదులే, నిత్యమైనవని, దేహమే ఆత్మ స్వరూపమనుకొను అసత్య ప్రవృత్తి తోచును. సకల కర్మలకు మూలమైన దేహమే నేను అనుకొనెడి దేహాభిమానము, లేక దేహాత్మబుద్ధి, ఆవరణ విక్షేపశక్తులవలన ఉత్పన్నమగును. ఆత్మ కంటే అన్యమగు దృష్టిని కలిగించుటయే ఆవరణ విక్షేపశక్తుల కార్యము. మన సహజ స్వరూపమగు ఆత్మను వేరుచేయుచు, భేద బుద్ధి రూపమగు యవనిక Viel of Separateness ను గల్పించి, ఆవరణ శక్తియే విక్షేపశక్తికి కారణమగుచున్నది.

తమోగుణమయమైన ఆవరణ శక్తి నుండియే, రజోగుణ ప్రవృత్తి మలైన కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాది దుర్గుణ భ్రాంతులుత్పన్న మగుచున్నవి. మనోవికారములైన రాగద్వేషా దులు, సుఖదుఃఖములు, సర్వకామ్య కర్మకలాపములు, విక్షేప శక్తి వలననే సృష్టింప బడుచున్నవి. విక్షేపమనగా బాహ్య వస్తు ఆభాస చింతనము. దీని వలననే ఆత్మానుభూతికి ప్రబల మగు ప్రతిబంధకము కలుగుచున్నది.

**అనాత్మ పదార్థజాలము :**

పైన వివరించిన స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు, ఆవరణ విక్షేపములు, అంతఃకరణ చతుష్టయము, పంచభూత ములు, ఇంద్రియ గోచరములగు నామ రూపాత్మకమైన ప్రపం చము, మొదలగు సమస్త బాహ్య దృశ్య జాతము అనాత్మ పదార్థములని సాధకుడు గ్రహించుకోవలెను. ఇదియే మాయా కల్పితమగు ప్రకృతి. ఈ ప్రకృతి యనబడు అజ్ఞానము యొక్క భాగమే వికృతమనబడు ప్రపంచము. ఈ ప్రపంచమగు జగత్తునకు, అస్తి (ఉండుట), భాతి (ప్రకాశించుట), ప్రియం (ఇష్టమగుట), రూపం (అనేక రూపములతో నుండుట) నామం (నామములతో పిలువబడుట) అను ఐదు అవయవములు గలవు. ఇందు అస్తి (సత్), భాతి (చిత్), ప్రియం (ఆనందం అగు మొదటి మూడు అంగములు ఆత్మ స్వరూపములై యుండగా నామ రూపములను చివరి రెండు అంగములును

జగద్రూపములై వ్యక్త భ్రాంత మగుచున్నవి. నామం అనేది ఒక రూపానికి పేరు-రూపం అనేది నామానికి గుర్తు ఆత్మ స్వరూపములైన అస్తి, భాతి, ప్రియం అను మూడు అంగములు సత్తాస్ఫూర్తులయి, జగద్రూపములగు నామ రూపములతో గల అన్ని బాహ్య వస్తుజాత మందును వ్యాపించి యుండునట్లు ప్రపంచము కల్పించబడి, గోచరించుచుండుట జరుగుచున్నది.

పైన విశదీకరించిన స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను వేరు విధముగా కూడ శాస్త్రములు వివరించినవి. అవియే పంచ కోశను లనబడును. స్థూల శరీరము అన్నమయ కోశము. దాని లోపల నుండునది ప్రాణమయ కోశము. ప్రాణమయ కోశములో, మనోమయ కోశము. మనోమయ కోశములో విజ్ఞాన మయ కోశము, విజ్ఞానమయ కోశములో ఆనందమయ కోశమును కలవు. ఆత్మావరోధములయిన మిథ్యా స్వరూపములగు ఈ పంచకోశములను నిషేధించగా, శేషించునది ఆ నిషేధించు వాడయిన నిషేధావధి. నేను నేనని భాసించు పరమాత్మయే. ఇదియే సర్వసాక్షియైయుండు మన సహజ స్వరూపము.

**అవరోధములు భ్రాంతి జనితములే :**

పైన వివరించిన ఆత్మావరోధములను, నిత్యానిత్య వస్తు వివేకాది ప్రమాణములతో విచారించినచో, అవన్నియు ప్రకృతి

పరిణామములగు జడపదార్థములనీ, కేవలము భ్రాంతి వలననే గోచరించుచున్నవనీ తప్పక తెలుసుకొన వచ్చును. అట్టి వివేచన వలన, చివరకు అట్లు తెలిసికొను "నేను" శేషించినదై, స్వయం ప్రకాశమానమై మన నిజ స్వరూపముగా భాసిల్లును. కనుక అవరోధములను పోగొట్టుకొనుటయే మన యథార్థ స్వరూపమైన భగవత్ స్వరూపమును ప్రకటితము చేసుకొనుట. అన్ని అవరోధములు అనాత్మ. అనాత్మను తొలగించుకొనుటయే సక్రమమైన సాధనామార్గము. మిగతా వన్నియు అమూల్యమగు కాలమును వృథాగా పాడుచేసుకొను వ్యర్థ ప్రక్రియలని చెప్పవగును.



ఓమ్

# మూడవ అధ్యాయము

# సాధక లక్షణ ప్రకరణము

## అవరోధ నిర్మూలనమే కర్తవ్యము :

స్వయముగా మనము, ఆనంద నిలయము, ఆకార శూన్యము, అక్రియము, ఆద్యంత రహితమునగు పరమాత్మ స్వరూపులమై యున్నాము. అట్టి మన యథార్థస్థితి భ్రాంతిచే మరుగు పడుటవలన, మన సహజ స్వరూపమునకు కలిగిన అవరోధములను తొలగించు కొనుటయే మన కర్తవ్యమని గ్రహించుకొనినాము. సర్వోత్తమమైన తత్త్వజ్ఞాన ప్రాప్తికి ఇదియే ఉత్తమమైన సాధనామార్గము.

## సాధక లక్షణ వివరణము :

సాధన సఫలముగా సాగుటకు, సాధకులు అలవరచు కొన వలసిన లక్షణములను ముందు గుర్తించుకొనవలెను. సాధకుడే లక్షణములను కలిగియున్న, అతని సాధన ఫలవంతమై ఆరోహణ క్రమముగా ముందుకు సాగునో అట్టిగుణ విశేషణములు,అనేక వేదాంత గ్రంథములలో విశదీకరింపబడెను. సాధకునకు భక్తి జ్ఞాన ప్రబోధములను కలుషితములు చేయునవి: అసత్సంకల్ప

ములు, అసద్భావములు, అసద్వచనములు అసత్కర్మములు అని టూకీగా అవతార్ మెహర్ బాబా వారిచే ఒకచోట చెప్ప బడెను.

"యోగశ్చ ప్రథమం ద్వారం
వాఙ్నిరోధో పరిగ్రహః
నిరాశాచ నిరీహాచ
నిత్య మేకాంత శీలతా"

అనగా మౌనము, పరులసొమ్ము తీసికొనకుండుట, వాంఛ లను విడనాడుట, కామ్యకర్మల యందెట్టి ప్రయత్నము లేకుండుట, ఏకాంతవాసమునందే ఎల్లప్పుడు ఆసక్తి కలిగి యుండుట. ఇవి యోగాభ్యాస మొనర్చుట కుపక్రమించిన సాధ కునకు ప్రథమ ద్వారములని పతంజలి యోగ సూత్రముల యందు గమనింపనగును. అనగా, సత్యవస్తు పరిశోధన మే ముఖ్య లక్ష్యముగా పెట్టుకొని, సాధనాభ్యాసమునకు బూనుకొనిన సాధకుడు, ముందుగా తన నిత్య జీవితము, పవిత్రము పరిశుభ్ర ముగావించుకొనుట చాలా ముఖ్యము. భగవత్ గీతోపదేశములో శ్రీకృష్ణునిచే, అర్జునునకు, సాధకు డలవరచుకొనవలసిన లక్షణ ములను ఎంతో విపులముగా విశదీకరింపబడెను. అవన్నియు 20 అంశములుగా క్రోడీకరించి దిగువ వివరించ బడినవి:—

1. ఎవరి యందునూ, ద్వేష భావము గాని, అసూయగాని లేకుండుట.

2) అందరిపట్ల స్నేహభావము, దయ, దాక్షిణ్యము కలిగి యున్న ప్రవృత్తిని అలవరచుకొనుట;

3) "ఇది నాది, అది నేను కలిగి యున్నాను" అనెడి మమకారము దేనియందును లేకుండుట;

4) సుఖము వచ్చినను, దుఃఖము కలిగినను సమబుద్ధి కలిగి యుండుట;

5) ఉన్నదానితోను, సంప్రాప్తించినదానితోను తృప్తి, సంతోషము కలిగియుండుట;

6) తన నిజస్వరూపమును తెలిసికొని, సిద్ధిపొందవలెననెడి జిజ్ఞాసతప్ప, ఎట్టికోరికలుగాని, దేనినైనను పొందవలెననెడి ఆకాంక్షలుగాని లేకుండుట;

7) ఇంద్రియ నిగ్రహముకలిగి, ఇంద్రియ వ్యాపారములలో దగుల్కొని పర్యవేష్టించుచున్న మనస్సును సమాధానపరచుచు, అదుపులోనుంచుకొనుట;

8) ఆత్మతత్వమును పొందవలెనను దృఢమైన నిశ్చయ బుద్ధి కలిగి, శరీర ప్రపంచాదులనిత్యములైనవని, సాధనతో సత్యవస్తువును పొందుటయే తన యేకైక కర్తవ్యమని గట్టి నమ్మకము కలిగియుండుట;

9 ఆత్మధ్యానమగు స్వస్వరూపానుసంధానమందు అత్యంత ప్రీతి కలిగినవాడై, సర్వకాలములయందును భగవత్స్వరూప మగు, "నేను" అని భాసించెడి ఆత్మాభిముఖుడై, సంకల్పా త్మకమగు మనస్సును భగవదర్పితముచేసి యుండుట.

10 మనోవాక్కాయకర్మల, ఎవరికి, ఎట్టిపరిస్థితులలోను బాధ గాని, సంక్షోభముగాని కలుగజేయకుండుట.

11) తాను ఎవరిచేతను, ఎట్టి పరిస్థితులలోనూ, ఎట్టిబాధగాని ఉద్వేగము (భయాది చిత్తక్షోభము గాని, తనకు కలుగజేయు పరి స్థితులు కల్పించుకొనకుండుట.

12 శారీరకముగను, మానసికముగను, వాసనారహితమగు పరిశుద్ధత, నిర్మలత్వము కలిగియుండుట.

13) సమర్థతకలిగి, వేదాంతశాస్త్రగ్రంథములలో వివరించిన, తత్వోపదేశ, సాధనవిధానములు అవగాహనచేసుకొను శక్తి సామర్థ్యములు గలవాడై యుండుట.

14 తప్పనిసరైన నిత్యనైమిత్తిక కర్మలు చేయుటుమినహా, ఏయితరప్రాపంచక విషయములను పట్టించుకొనక, వాటియందు విముఖత, అలక్ష్యము కలిగియుండుట.

15 కామ్యకర్మలు చేయుటకాని, చేయుటయందు ఆసక్తికాని వదలిపెట్టినవాడై యుండుట.

16 తనపట్ల శత్రుభావముగల వానియందును, మిత్రభావము గల వానియందును సమత్వబుద్ధి కలిగియుండుట.

17 మానావమానములలో సమముగానుండు అనుభూతిని అలవరచుకొని, నిందాస్తుతులను ఒకటిగానే భావించుట.

18 శీతలము, ఉష్ణము, సుఖము, దుఃఖము మొదలగు ద్వంద్వములయందు సమత్వము కలిగియుండుట.

19 దొరకినదానితో సంతృప్తిచెంది, పరమార్థవస్తువిషయమై నిశ్చయబుద్ధి కలిగి యుండుట.

20 మౌనముపాటించుచు, మితభోజనము, మితనిద్ర, మిత వాగ్వ్యాపారమును గలిగియుండుట.

**లక్షణముల ఆవశ్యకత**

పైన ఉదహరించినవి, ఉత్తమమైన పరమార్థజ్ఞాన లక్షణములు. వానిలోకొన్ని అలవరచుకొనుట కష్టతరమనిగాని, అసాధ్యమనిగాని కొందరుభావింప వచ్చును. ఈ లక్షణములుగల వారు నాకత్యంత ప్రియులని భగవద్గీతలో శ్రీకృష్ణునిచే అర్జునునకు చెప్పబడెను. ఆత్మసాక్షాత్కారముకొరకు చిత్తశుద్ధితో సాధన

చేయుటకు పూనుకొనిన సాధకుడు, భగవంతునికి ప్రియతమమైన లక్షణములను అలవరచుకొనుటలో ఎప్పుడునూ వెనుకంజ వేయడు. ఈ లక్షణములను పాటించుసాధకునకు, సత్వరముగ సత్యస్వరూప సాక్షాత్కారము సులువై సాధన సఫలీకృతము కాగలదు. కనుకనే, ఇవి భగవంతునకు ప్రియతమమైన లక్షణములైనవి. అనగా, జ్ఞానప్రాప్తికి సాధకుని అర్హునిగా జేయునవి. సాధకునిలో అహంకారభావము తగ్గి, విషయవాంఛలు నిర్మూలమై, దోషరహితమైన పవిత్రత సాధకుడు పొందుటవలన, సాధన సఫలీకృతమై, నిర్విఘ్నముగ సాగగలుగును.



ఓమ్

# నాల్గవ అధ్యాయము

# సాధన ప్రకరణము

**లక్షింపవలసినది బ్రహ్మానుభవము:**

**ఆత్మ**జ్ఞానము సులభముగను సత్వరముగను లభింపజేయు సాధనామార్గమును సాధకుడు చేపట్టవలెను. అట్టిసాధన **అతి** సహజమైనదిగను, తిన్ననైనదిగను నుండవలెను.

లక్షింపవలసినది మన నిజస్వరూపమగు బ్రహ్మానుభవము. అనగా, మన నిజస్వరూపమేదో దానిని మనముఅనుభూతి పొందుట. అట్టి అనుభవము జ్ఞానోదయమువలననేకాని, ఏఇతరోపాయములవల్లను కలుగదనునది నిస్సంశయము, సర్వవిదితమునై యున్నది.

**ఆత్మజ్ఞానమే సాధనగమ్యము :**

"పఠన్తు శాస్త్రాణి యజన్తుదేవాన్
కుర్వంతు కర్మాణి భజంతుదేవతాః
ఆత్మైక్యబోధేన వినా విముక్తి
ర్నసిధ్యతి బ్రహ్మశతాంతరేపి"

అనునది ఆదిశంకరుల వివేకచూడామణిలోకాననగును. అనగా, ఎన్నిశాస్త్రములను జదివినను, యజ్ఞయాగాదులెన్ని చేసినను, ఎంతమంది దేవతలను భజించినను, వీటివలన ఆత్మాను

భూతికలుగదు. ఇట్టి కార్యకలాపములు, వందలకొలది సంవత్సరము లాచరించినను, ఆత్మజ్ఞానము కలుగనిదే, ముక్తిసిద్ధింపదు. "జ్ఞానా దేవతుకైవల్యం" "జ్ఞానాదేవ మోక్షః, ఏతావదరే ఖల్వమృత త్వమ్" అను శృతులు ఆత్మజ్ఞానమువలననే స్వస్వరూపమగు బ్రహ్మత్వము సిద్ధించునని బోధించుచున్నవి. కావున మోక్ష సాధనము జ్ఞానమేనని శాస్త్రములు నిర్ధారణ చేసినవి.

**నిత్యానిత్యముల** వివేచన :

జ్ఞానమనగా ఆత్మానాత్మవివేకము. అదే నిత్యానిత్యవస్తు వివేకము. అనగా, గోచరించెడి జడసముదాయములగు లోకము, శరీరము, పంచేంద్రియకూటము, అంతఃకరణ చతుష్టయమగు మనః స్చిత్త, బుద్ధ్యా హంకారములు సర్వమూ, మిథ్యాజన్య ములును, ఆరోపితములు, అనిత్యములు గాని, అవి యదార్థములు గావని నిశ్చయించుకొని, తదుపరి, లోపల, వెలుపల, అంతటనూ నిండి యుండి, సర్వావస్థలను ప్రకాశింపజేయు చైతన్యస్వరూప మగు బ్రహ్మమును నేనే అని అనుభూతి చెందుటయే జ్ఞానము. అట్టి అనుభూతి కలుగుటకు అవరోధములగు అనాత్మపదార్థముల నిర్మూలనమే సాధనామార్గమని గుర్తించినాము.

**మహావాక్యములు :**

ఇపుడు సాధకుడు సతతము గుర్తుంచుకొని మననము చేసికోవలసిన ముఖ్యాంశ మొకటి యున్నది. సకల వేదాంత

సిద్ధాంతములకు ఆధారమైనట్టి "ప్రజ్ఞానం బ్రహ్మ", "తత్వమసి" "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ" "సర్వంఖల్విదం బ్రహ్మ" అను మహావాక్యములున్నవని సర్వవిదితమును ప్రసిద్ధమునై యున్నది. ఈ శ్రుతి వాక్యములు సాధకుల హితమునుగోరి, ప్రత్యక్షసత్యమగు బ్రహ్మస్వరూపమునుబోధించుటచే, తల్లివంటివని చెప్పబడెను. అత్యంత శ్రద్ధాభక్తులతో ఈ వాక్యార్థములను విమర్శించిన తప్పక ఆత్మానుభూతి కలుగుననుట నిస్సందేహము. ఈ మహావాక్యములు జీవాత్మపరమాత్మలకు ఐక్యమును బోధన చేయుచున్నవి. అనగా, స్వతఃసిద్ధము, స్వయంప్రకాశమునగు యే చైతన్యముచే సకలచరాచర జడమయమగు సృష్టి భాసించుచున్నదో, ఆచైతన్య పరబ్రహ్మస్వరూపము నీవే; అదే నీయదార్థమైన ఆత్మస్వరూపమని బోధించుచున్నవి. బ్రహ్మస్వరూపమే మన నిజస్వరూపమై భాసించుచుండ, దానిని మరుగుచేయుచుండు, అరిష్టదాయకమగు అవరోధములను పోగొట్టుకొను నిమిత్తమే సర్వసాధనలు.

**మిథ్యాజ్ఞానము, ఆత్మజ్ఞానము :**

మనకు రెండువిధములైన జ్ఞానములున్నవని ముందు తెలిసికొనవలెను. మొదటిది అజ్ఞానమువలన భాసించెడి జ్ఞానము. దీనినే అవిద్య లేక మిథ్యాజ్ఞానమనికూడ అందురు నేను, నాది, నేను చేయుచున్నాను, నేనుచదువుచున్నాను, ఈ శరీరము, ఆస్తిపాస్తులు నావి, అనుకొనెడి, అహంకార మమకార కర్తృత్వ

భావమేదైతే మానవులలో సర్వసామాన్యముగా భాసించుచుండునో, అదియే అవిద్యాధారమైనదగుటవల్ల మిథ్యాజ్ఞానము. ఈ జ్ఞానము కలుగుటకు అజ్ఞానము లేక అవిద్య కారణమై యున్నది. దీనినే ప్రకృతి వికారమగు విజ్ఞానకోశమని అందురు. ఇదియే జీవుడై సర్వసంసార సుఖదుఃఖములను అనుభవించుచుండుట జరుగుచున్నది .ఇక రెండవ జ్ఞానము, తత్వమస్యాది మహావాక్యములు బోధించెడి "నేనే బ్రహ్మస్వరూపుఁడనై యున్నాను 'అహం బ్రహ్మాస్మి)' యనెడి ఆత్మజ్ఞానము. ఇదియే ప్రజ్ఞానము. ఈ ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపమని "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యము ప్రబోధించుచున్నది, ప్రజ్ఞానమే సమ్యజ్ఞానమనికూడ అనబడుచున్నది.

ఆత్మాపరోక్షజ్ఞాన మనుభూతియగుటకు, అజ్ఞానకారణము వలన ఉద్భవించిన, మిథ్యాజ్ఞానమును పోగొట్టుకొనుటయే సాధనమైయున్నది. నిరంతరము ఆత్మానాత్మ వస్తువిచారము వలన, ఆత్మజ్ఞానమగు సమ్యజ్ఞానము సిద్ధించును. అనగా అనాత్మ పదార్థజాతమగు దేహాదిదృశ్యప్రపంచముయొక్క యదార్థస్వరూపమును పదేపదే శ్రద్ధతో విచారించుటవలన, మిథ్యాజ్ఞానము తొలగి సంమ్య జ్ఞానము సిద్ధించును. మూర్ఖత్వమువదలిలి దైవత్వము కలుగును.

## సాధన క్రమము:

ఎంత బుద్ధిశాలికైనను, అజ్ఞానజన్యములగు, స్థూల,సూక్ష్మ కారణశరీరాది జడసముదాయములన్నియూ మిథ్యాభూతములని

తాను నిజముగా నామరూపములులేని చైతన్యమాత్రుడని, అనుకొనినమాత్రమున, ఆత్మజ్ఞానము కలుగజాలదు. ఏవి అనాత్మ పదార్థములో, అవియన్నియు అనుభవపూర్వకమగు దృఢ విశ్వాసముతో మరలమరల మననము చేయుచు, వాటి యదార్థ స్వభావమును మనస్సున నాటుకొనునట్లు గుర్తించుకొని అనుభూతి పొందినవాడై వాటిని విసర్జింపవలెను. ఇట్లు దృఢాభ్యాసముచే ఆత్మస్వరూపముకంటె భిన్నమై ఆరోపితములగు కల్పిత పదార్థ జాతమంతయూ (స్వశరీరముతోసహా) 'నేను' కానిదిగనుక మిథ్యగా నిరసింపబడగా, మిగులునది స్వస్వరూపమే యగును. అట్టి మన నిజస్వరూపము స్వతఃసిద్ధము, స్వయంజ్యోతిః స్వరూపమునై ఎల్లకాలములయందు ఎల్లెడల భాసించుచునునే యున్నది. అటువంటి మన చిదాత్మస్వరూపమందు, ఆరోపింపబడిన, అనాత్మసముదాయమైన, కర్తృత్వభోక్తృత్వాది భ్రాంతిభావములను, మిథ్యాగోచరములగు జగశ్శరీములను "నేతి నేతి", అనగా, ఇదికాదు ఇదికాదు, అని నిషేధించుచూ, చేయబడు మానసిక సాధనయే ఆత్మావబోధములన్నింటినీ నిర్మూలించుకొను సాధన. విద్యాబుద్ధులుగల ఏపాటి వివేకవంతులకైనను ఈసాధన సులభము, సుఖదము, సుహృదమునై, ఆచరించుటకు అనుకూలమై యుండునని చెప్పనవసరములేదు. ఈసాధనాకార్యక్రమము ఎట్లు చేసికొనవలెనో భగవాన్ రమణమహర్షి "తత్త్వోపదేశముల"లో చక్కగా సూచింపబడినది.

సాధకుడు, ముందుగా, తనను తాను, ప్రపంచములో కాన వచ్చు ఇతర జంతుజాలములకును దృశ్య వస్తువులకును భిన్నునిగా గుర్తించుకొనుట. అనగా "నేను ఎద్దుని గాను, మేకను గాను, గుర్రమును గాను. ఏ జంతువును గాను, నేను ఏ పక్షిని గాను, చెట్టును గాను, గోచరించెడి ఏ వస్తువును నేను కాను. నేను మనుష్యుడను", అని సాధకుడు ముందుగా ఈ విధముముగా గుర్తించు కొనవలెను. ఇట్లు తాను మనుష్యుడనని, ఇతర జంతుజాలములు మొదలైన వానికి భిన్నుడనని, తెలుసుకొనగలిగినాడు. ఇది ప్రప్రథమమైన అత్యల్పమైన విచక్షణ. ఈ విచక్షణా జ్ఞానము కొన్ని జంతువులకు కూడ కలదనుట ప్రత్యక్ష ప్రమాణము. ఈ ప్రథమ సాధనోపక్రమణము ఎంతో హాస్యాస్పదముగ ఉండ వచ్చును. కాని, విచక్షణ అనునది ఈ విధముగా ప్రారంభ మగుచున్నదని ఒకసారి అనుకొనుటలో నష్టమేదియు కలుగదు.

తరువాత సాధకుడు తన స్థూలశరీరములోని వివిధ భాగములను ఆ విధముగనే విచక్షణ చేసుకొనవలెను. అనగా, తన చేతులను పరిశీలించుకొని, నేను నా చేతులను గాను. ఇవి ఎముకలు, రక్త మాంసాదులతో నిండియున్న జడపదార్థములు. తోలు కర్రలవలె నున్న యీ చేతులకు స్వయముగా సత్తా స్ఫూర్తులు లేవు. నేను ఎట్టి పనులు చేయమని ఆదేశించిన ఆయా పనులు చేయు నా పనిముట్లు తప్ప ఇవి నేనెన్నెడు కాదు. అట్లే నేను నా కాళ్ళనుగాను. అవికూడ నాకు గమనము చేయుటకు

సహకరించు పరికరములు. అవి నేనెన్నడును గాను, అవికూడ స్వయముగా సత్తాస్ఫూర్తులు లేని జడపదార్థములే. అట్లే, నేను నా మొండెమును గాను; మెడను గాను; నా తలను గాను; ఈ శరీరములో ఏ భాగమును నేనుగాను. అనగా జడపదార్థ అవయవ సముదాయమగు ఈ స్థూల దేహమును నేను గాను. నేను యదార్థముగా ఈ శరీరమునకు భిన్నుడనే. నేనే ఈ శరీరమనుకొనుచున్న దేహాత్మ బుద్ధి అసత్యమైనదే. నిజముగా భ్రాంతియే. ఆరోపితమే. అవివేకము వలననే ఇట్టి అసత్యాపు ప్రవృత్తి నాకు కలిగినది గాని నిజముగా ఈ శరీరము నే నెన్నడును కాను.

నేను మేకను గాను, గుర్రమును గాను, పక్షినిగాను, నేను మనుష్యుడనని, సాధకుఁడెంత స్పష్టముగ, నిస్సందేహముగా తెలుసుకొనినాడో, అంత సుస్పష్టముగను సందేహ రహితముఁగను, తానీ జడపదార్థ అవయవ సముదాయమగు శరీరమును గానని సాధకుడు అనుభవ పూర్వకముగ గుర్తించు కొనవలెను. అంతట, ఈ నామరూపాత్మకమైన శరీరము నేను కానిచో, నేను ఎవరనను భావము, సాధకునకు ఉదయించక తప్పదు. జాగ్రదావస్థలో గోచరించెడి, ఈ ప్రపంచములో కానవచ్చు, పశు పక్ష్యాద్యేతర జాతములలో నేనేదియూ గాక, ఎల్లప్పుడు, నన్నంటియున్న శరీరమునూ, నేనుగాక పోయినచో, ఇక మిగులు నా యథార్థ స్వభావ మెట్టిది? అది నిజముగా, శాస్త్రములలో

ఘోషించు నామరూప రహితమైన చైతన్య స్వరూపమే అగును. ఎట్టి సందేహామునకు అవకాశము లేదు. ఏ "నేను", పదార్థ విచక్షణా జ్ఞానముచే, ఈ ప్రపంచములో ఏదియూ తాను గానని జడమయమగు ఈ దేహము కూడ తానుగానని నిశ్చయించి తెలిసి కొనినదో, అదే, ఆ తెలివిని కల్గినదే, తన యథార్థ స్వభావమని సాధకుడు తప్పక తెలిసి కొనగలడనుటలో ఎట్టి సందేహాము లేదు. అనగా, "నేను నేను" అని భాసించెడి ఏ యెరుక (Consciousness సర్వమునకు కారణమై, అధిష్ఠానమై, ఎల్లప్పుడు అలరారుచున్నదో, అదే తన యదార్థ స్వరూపమని సాధకుడు తప్పక తెలిసికొనగలడు. ఈ తెలిసికొనుట మానసికముగా చేయు ప్రక్రియ కాదనుట ముఖ్యాంశము. అనుభవ పూర్వకముగా, నామరూప రహితమై, నేను నేనని భాసించు తన నిజస్వరూపములో సాధకు డనుభూతి జెందుటయే ఈ సాధన యుక్క సారాంశము.

> అనుభూతిం వినా మూఢో వృధా బ్రహ్మణి మోదతే ॥
> ప్రతిబింబిత శాఖాగ్ర ఫలా స్వాదన మోదవత్॥

అనగా, అనుభూతి పొందని సాధకుడు నీటియందు ప్రతిబింబించిన చెట్టుకొమ్మకు గల పండును జూచి తినినట్లు భావించుకొని సంతసించువానితో సమానమగును. అనుభూతి యన స్వస్వరూపానుభవమగు ఆత్మానందములో నిమగ్నుడగుట.

ఏలయన, దేహాత్మబుద్ధి, అనగా, "నేను దేహమును" అనుకొనెడి భావము, అనాదియై, అనేక చిలువలు పలువలు గలిగి ఒక పెద్ద విష వృక్షముగా పెరిగియున్నది. వేళ్ళు పాతుకొనియున్న ఈ వృక్షమును పెకలించి తొలగించు కొనుటకు, సాధకునకు సంతత దృఢాభ్యాసము అవసరము.

నేను శరీరమనే భావమొక్కటియే కాదు. నేను పురుషుడను, బ్రాహ్మణుడను, క్షత్రియుడను, అందమైన వాడను, గృహస్థుడను, సుఖముల ననుభవించుచున్నాను, చిక్కియున్నాను, నాకు దుఃఖము కలిగినది, నేను ధనికుడను, నాకు రోగము వచ్చినది. నేను తినుచున్నాను. నాకు ఈ ఆస్థులున్నవి అనుకొను అనేక రకముల కర్తృత్వ భోక్తృత్వ భావ పరంపరలతో పాతుకు పోయివున్న దేహాత్మబుద్ధిని సులువుగా వదలించుకొనుట సాధ్యము కానేరదు.

**తీవ్రతర సాధనావశ్యకత :**

మనకు సంక్రమించిన సర్వకర్మ కలాపములకును, ఈ దేహాత్మబుద్ధి, లేక దేహాభిమానమే మూలకారణమై యున్నదని, గ్రహించుకొనవలెను. కావున దేహాత్మబుద్ధి ఎంత దృఢమై యున్నదో, అది వొదలిపోయి, అంత దృఢముగాను ఆత్మ సాక్షాత్కారము కలుగుటకు తీవ్రతరమైన సాధనాభ్యాసము చేయుట అత్యవసరము. తీవ్రతరమైన సాధనచేయనిదే, సాధకు

నకు ఆధ్యాత్మిక ప్రగతి సిద్ధింపదు. తెలివితో, పట్టుదలతో, ఎట్టి ఆటంకములకు లొంగక సాధన చేయవలసి యున్నది.

దృఢమైన వివేక వైరాగ్యములతో, తప్పనిసరియైన ఇతర కార్యక్రమములను త్వరత్వరగా ముగించుకొనుచు, ఎల్ల వేళల సావధాన చిత్తుడయి తన స్వస్వరూపాను భూతి కొరకు అత్యంత కుతూహాలుడై సాధకుడు ధ్యాన నిమగ్నుడు కావలెను. ఈ ధ్యానమునకు రెండే ముఖ్యాంశములు: మొదటిది, అనాత్మ పదార్థముల స్వభావము నెరింగి వాటిని విసర్జించుచు, వాటి తలంపులు మనసులోకి రానీయకుండ రక్షించుకొనుట. రెండవది సర్వ అనాత్మ పదార్థములను, "నేతి నేతి" మహావాక్యాధారముగా, విడనాడిన, ఇక శేషించు తన నిర్విశేష నిజస్వరూపమై భాసించు చైతన్యాద్వయానందములో నిమగ్నుడై యుండుట,

వివేచనలో సాధకుడు శాస్త్రములలో విశదీకరించిన అనేక అంశములను తరచి తరచి విచారించుకొని తనకుతానే అనుభవపూర్వకముగా నిర్ధారణ చేసుకొనవచ్చును.

తొలుదొల్త, అన్నమయకోశమనెడి స్థూలదేహమును నేను గానని, దేహముకంటే నేను స్వయముగనే విలక్షణుడనని తెలిసి కొనవలెను. స్థూలశరీరము పూర్వజన్మార్జిత ప్రారబ్ధ కర్మాను సారము నిర్ణయింపబడి సూక్ష్మభూతములగు, భూమి, జలము తేజస్సు, వాయువు, ఆకాశము యొక్క పంచీకరణము వలన ఉత్పత్తి కాబడి స్థూలరూపము దాల్చుచున్నది. పంచీకరణ

మనగా ఒక్కొక్క సూక్ష్మ భూతములో సగము భాగమునకు తక్కిన నాలుగు భూతములలో ఒక్కొక్క దాని అష్టభాగమును కలపగా నేర్పడు భూత సమ్మేళనము.) స్థూల శరీరము తాను గానిచో, దాని ఉత్పత్తికి కారణభూతములయిన పంచభూతములు కూడ, తన స్వరూపములుగావని, సాధకుడు గుర్తించుకొనవలెను. పంచభూతములు జాగ్రత్ స్వప్నావస్థలలో మాత్రము ఇంద్రియములకు గోచరించుచున్నవి. సుషుప్తావస్థలో స్థూల శరీరముతో బాటు అవియు లయమై అదృశ్యమగుచున్నవి. ఇక, స్థూలశరీరము, పంచభూతాది ప్రపంచము, ఇంద్రియకూటమగు మనస్సునకు గోచరించుచుండుటచే, మనస్సే తన నిజ స్వభావమై యుండునేమోనని సాధకుడు యోచించుకొనవలసి యున్నది. మనస్సు, పంచేంద్రియ కూటమితో కూడినదై మనోమయ కోశ మనబడుచున్నది. మనకు గలిగిన దేహాత్మభావము, సకల కర్తృత్వ, భోక్తృత్వ భావము, మనోవిజృంభణము వలననే కలుగుచున్నవి. పంచేంద్రియముల ద్వారా జరుగు మనోవ్యాపారమే ప్రపంచక స్మృతికి కారణమై యున్నది. అనగా, జాగ్రదావస్థయందు మనము మనస్సునకు వశులమై విషయ వాసనలలో జిక్కుకొని, మనస్సు కల్పించు దేహాత్మ భావము వలన, శబ్ద, స్పర్శ, రూప, రస,గంధముల వలన జనియించు సకల ప్రాపంచక విషయజాతము, రాగద్వేషములు, క్షుత్పిపాసలు మొదలగు సర్వ వికారములు, మనవే యనుకొనుచూ, మన యథార్థ స్వరూపమునకు విరుద్ధమైన స్థితిలో నుండుట జరుగుచున్నది.

మనస్సు వలననే మన సహజ స్వరూపమగు నిశ్చల చైతన్య స్వరూపము మరుగగుచున్నది. మనోవిజృంభణమే, అనిశ్చలతకు మూలము. జాగ్రత్స్వప్నావస్థల యందు మనస్సు విజృంభించుచు, మనకు కర్తృత్వ భోక్తృత్వ భావములను కల్పించుచున్నది సుషుప్తియందు మనస్సు మనలో లీనమై లయమగుచున్నది. అందుచే కర్తృత్వ భోక్తృత్వ భావములు సుషుప్తిలో మనకు ఉండవు. కాబట్టి మనకు కలుగుచున్న కర్తృత్వ భోక్తృత్వ భావము జాగ్రత్ స్వప్నావస్థలలో మనస్సు కల్పించు భ్రాంతి కార్యకలాపమే కాని యథార్థము కాదనుట తేటతెల్లమగుచున్నది.

**బంధ మోక్షములు మనో కల్పితములే :**

బంధముగాని, మోక్షము కాని, మనకు వాస్తవముగా లేనే లేవని గ్రహించుకొనవలెను. అవి వట్టి మనోకల్పితములే. ఇట్లు అనర్థమగు సర్వ వికారములను మనకు సంక్రమింపజేయు మనస్సనెడి అవిద్యా ప్రవృత్తి, మన యథార్థ స్వరూపమెట్లగును? కానేకాదు. మనస్సు సర్వదా మార్పులు చెందుచూ, పెరుగుచూ, తరుగుచూ,సుషుప్తిలో అదృశ్యమగుచూ, జడస్వభావము గలదగుట వలన, మన నిజస్వరూపమగు పరమాత్మ ఎంతమాత్రము కాదని సాధకుడు తరచి తరచి వివేచనచే గ్రహించుకొని మనోమయ కోశమును కూడ, "నేతి నేతి" మహావాక్య విచారణలో విసర్జింపవలెను.

స్థూలశరీరమును అన్నమయకోశమందురు. ఈ స్థూల శరీరమును, సూక్ష్మ శరీరమనెడి మనోమయకోశమును మన యథార్థ స్వరూపములు గానిచో, ఇక శేషించినదేది? కారణ శరీరమనబడు అజ్ఞానము లేక అవిద్య మనస్వరూపమగునా? అజ్ఞానమే మాయ. సత్యమైన దానిని అసత్యముగను, అసత్యమైన దానిని సత్యముగను, తోపజేయు అనిర్వచనీయ శక్తియే మాయ అనబడుచున్నది. ఇది భ్రాంతికి సృష్టి కర్త. ఈ శరీరమే నేను అనుకొను అహోవాభావమునకు మూలము.

నేను స్థూల శరీరమునుగాను, సూక్ష్మశరీరమగు పంచేంద్రియకూటమి, అంతఃకరణ చతుష్టయమగు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ఇవియేవియూ నేనుగాదు వీటన్నిటికీ కారణమైన అజ్ఞానము, లేక. మాయయును నేనుగాను. స్వప్నమందు దోచు సర్వవిషయములు కల్పితములై ఏ ప్రకారమసత్యములో, ఆవిధముగనే, ఈ దృశ్య ప్రపంచము, శరీరము, పంచప్రాణములు, పంచేంద్రియములు, అహంకారాది సర్వ వికారములున్నూ, జ్ఞానోత్పత్తియైన వెంటనే మిథ్యగా తెలియుట వలన, ఇవియన్నియు నశించును.

**దివ్యానుభవము :**

తాను, నిరాకార, నిర్వికార అనంతమయుడగు ఆత్మ స్వరూపుడని సాధకుడు వివేచనవలన తప్పక తెలిసికొనగలుగును. అట్టి ఆత్మజ్ఞానచైతన్యము ఉద్భవించినతోడనే, ఇక స్థూల, సూక్ష్మ మనోమయ చైతన్యముల భ్రాంతి వదలిపోవును. శేషించునది

అంతిమ దివ్యానుభవమగు ఆత్మజ్ఞానమే. అదేమన యథార్థ సత్య స్వరూప చైతన్యము.

తానే ఆ చిత్ భగవత్ స్వరూపుడై యుండ. సాధకుడు ప్రార్థించవలసినది దేవుడెవరు? భగవంతునిగూర్చి చేయు సకల ప్రార్థనలు తననే చేరును. దైవస్వరూపమైన తనను తాను మరచుటవలననే సర్వ అనర్థములు తనను భ్రమింపజేయుట జరుగుచున్నదని సాధకుడు గుర్తించగలుగును. సాధకుడు చేయు సర్వ ప్రార్థనల సారాంశము తాను మరచియున్న తన దివ్యత్వమును తిరిగి పొందుటకు చేయు మొరయే. గూఢముగానున్న తన యథార్థ పవిత్రత్వమును అనుభవించుటయే అన్ని సాధనల ఉద్దేశము. తాను నిజముగా నామరూపరహిత నిర్గుణ పరబ్రహ్మ స్వరూపుడై యున్నాడు. అట్టి విశ్వాసము సాధకునికి తన పవిత్రాంతఃస్ఫురణ కలిగిన తదుపరి దృఢముగా, సుస్థిరముగా నుండును.

తాను స్థూలాది శరీరముగానందున, జరామరణములు గాని క్షుత్పిపాసలుగాని, నిజముగా తనకు లేవు. జరామరణములు శరీర ధర్మములు. క్షుత్పిపాసలు ప్రాణ ధర్మములు. ఇక తాను సూక్ష్మ శరీరముకాని, కారణ శరీరముకాని, కానందున తనకు, జనన మరణములుగాని, క్షుత్పిపాసలుగాని, లేకపోవుటయే గాక, శోక మోహములుగాని రాగద్వేషములుగాని, నిజముగా తనకు ఎప్పుడునులేవు, పంచేంద్రియములలో, ఏదియూ తాను

గాక పోవుటచే, పంచేంద్రియ ప్రవృత్తులగు, శ్రవణము, స్పర్శ, దృశ్యము, రుచి, వాసన అనునవేవిన్నీ నిజముగా తనకు లేనే లేవు అంతఃకరణ చతుష్టయములో మనస్సు తానుగానందున, తనకు సంకల్పమూ వికల్పమూ లేవు బుద్ధితానుగానందున, తెలిసికొనుట అనునది తనకు నిజముగా లేనేలేదు. కర్తృత్వ భోక్తృత్వము లేవీ తనకు లేవు.

ఇట్లు తనకు లేవని గ్రహించి నిర్మూలముగావించిన ప్రవృత్తులన్నీ ఆధ్యాత్మిక అసత్యము లనబడునని ఒక మహా పురుషునిచే వివరింపబడెను. ఈ ఆధ్యాత్మిక అసత్యములు కొన్ని శరీరమునకు సంబంధించినవికాగా, కొన్ని మనస్సు, ఆది అంతర ఇంద్రియములకు సంబంధించినవై యున్నవి. జిజ్ఞాసతో సక్రమ మైన సాధనచేయు సాధకుడు, ఈ ఆధ్యాత్మిక అసత్యములను గుర్తించిన వెంటనే, భ్రాంతి వదలుటచే, అపరిమితాశ్చర్య చకితుడై, నామరూప రహితమై నిర్బాధాయుతమగు తన నిజ స్వభావములోని ఆనందమును అనుభవించుటకు ప్రారంభించును. శరీరము, మనస్సు, ఇంద్రియములు, బాహ్యప్రపంచము, కర్తృత్వ భోక్తృత్వములు, సమస్తములు, తనకు గలిగిన భ్రాంతులేగాని, యథార్థముగా, ఇవి ఏమియూ లేనివేయని, సాధకునకు కరతలామలకముగా అనుభవమునకు వచ్చును. తనలో జనించుచున్న సమస్త సంకల్పవికల్పములు, సుఖ దుఃఖానుభవములు తదితర ద్వంద్వానుభవములు, మాయాకల్పి

తములే. అవన్నియు, ఆత్మస్వరూపుడై యున్న తనయొక్క భ్రాంతులు మాత్రమేకాని, యథార్థముగా ఉనికిలేనివని, సాధకునకు, తేటతెల్లము కాగలదు.

"తాను" అనునది ప్రధానమై తెలిసిన, తనయొక్క భ్రాంతులు, తనకు భిన్నమైనవిగా నుండుటకు అవకాశమే లేదు. గనుక, మిథ్యా స్వరూపములైన శరీరము, మనస్సు, ఇంద్రియములు. అంతఃకరణ చతుష్టయము, పంచభూతములు, మున్నగు ప్రకృతి వికారములన్నియూ, ఆత్మవేకాని ఆత్మేతరములు గావని ఆత్మజ్ఞాన ముదయించినంతనే ఇవన్నియూ ఆత్మలో లయించి పోవునవని, సాధకునకు తెలియగలదు. ఇవియేవియూ నిజముగా అతడూకాదు; అతని అంశములునూకావు. అవియన్నియు అతని మాయాశక్తి కల్పనలు మాత్రమేనని అనుభూతియగును.

ఇట్టి తెలివియే ఆత్మజ్ఞానము. ఈ తెలివిలో సర్వకాల సర్వావస్థలయందు స్థిరత్వము సాధించుటయే జ్ఞానసిద్ధిని పొందుట. జ్ఞాన సిద్ధునకు, చిత్తవృత్తులు శాంతించి పరమాత్మలోలయించును. అతడు వికారరహితుడు. ఎల్లప్పుడు శాంతము, ఆనందము గలిగి సంకల్పరహితుడై విరాజిల్లును.

సాధకుడు, తాను "సర్వమును తెలిసికొనుచున్నాను, జ్ఞానమును పొందుచున్నాను," అని అనుకొనుచుండుట, ఇంకను మిగిలియున్నచో అది అహంకార లక్షణమైన అవివేకమై యున్నది. తనను ఒక ప్రత్యేక ఉనికిగల "తాను" గా అపోహ

పడుచుండునంత కాలము, అహంకారమను దేహాత్మబుద్ధి తనను వదలలేదని సాధకుడు గుర్తుంచుకొనవలెను. అన్ని అవరోధములను వదల్చుకొని, ఆత్మసాక్షాత్కారము కొఱకు తపించుచున్న సాధకునకు, అహంకారము తనకు తెలియకుండగనే తనను వదలక పెద్ద ప్రతిబంధకమై పీడించుచుండును. తాను నిజముగా నామరూపములులేని అపరిమితమగు చైతన్య స్వరూపుడైయుండ, ఒక పరిమితత్వపు ప్రత్యేక ఉనికిని తనకు భ్రమింపజేయుచు, అపోహపెట్టుచుండు అహంకార భ్రాంతిని, ఏ విధముగనైనను సాధకుడు వదల్చుకొనవలెను. తీవ్రతరమగు దృఢవిశ్వాసముతో కూడిన ధ్యానాభ్యాసము వలననే ఈ అహంకారము తొలగిపోగలదు. ఎంతపర్యంత మీ అహంకారము మిగిలియుండునో అంత పర్యంతము ఆత్మసాక్షాత్కారము కలుగదుకదా! పరిపూర్ణాత్మానుభూతి కలుగుటకు అహంకారము నిశ్శేషముగ నశించవలెను. ఇది సాధనలో చిట్టచివరి దశగా చెప్పనగును. స్థూల శరీరమే నేను అనుకొనెడి అసత్యపు భావన అనాదిగా అలవాటుపడియుండుటవలనే, ఇది సాధనలో చిట్టచివరి వరకును సాధకుని వదలక యుండును, దీనివలననే సాధకులకు దేహవాసన, లోక వాసన, శాస్త్రవాసన వదలక, కాళ్ళకు తగిల్చిన సంకెళ్ళవలె, ప్రతిబంధకములై యుండును.

**ఆత్మానుభూతి :**

అహంకారము నిశ్శేషముగ తొలగిపోయిన వెంటనే, సాధకుడు నిత్యానంద స్వరూపుడై తన స్వస్థితియందు ప్రకాశించును.

సాధకునిలో కుత్సిత అహంకార జీవితము అంతమొంది, సర్వాత్మ భావము ఉదయించినది. అనగా తనయొక్క ప్రత్యేక ఉనికి భ్రాంతితొలగి, సర్వమును తానే అయివున్నానను, నిస్సంశయమగు నిశ్చయ బుద్ధి కలిగినది. తాను దేహాతీత, నాశరహిత, నిత్య, సత్యాత్మ స్వరూపుడిని అన్న భావము అనుభూతమైనది. ఇక దేహాది దృశ్యప్రపంచము తనకు లేదు. అవి మెలకువరాగానే స్వప్నమువలె, అసత్యమైనవని తెలియుటచే సాధకునకు ఇక స్ఫురింపవు

ఈ విధముగా, అజ్ఞానరూప జనితములైన సమస్త అనాత్మ ప్రవృత్తులను అహంకారముతోసహా నశింపజేసుకొనిన సాధకునకు, అజ్ఞానమనెడి నిద్రనుండి మేల్కొనినట్లు అనుభూతి కలుగును. తాను నామరూపరహితమైన శుద్ధుడును, సర్వజ్ఞుడును, సర్వసాక్షియునై యుండును. సాధకునికిక దేహాభిమానము కలుగదు. తాను తెలిసికొంటున్న భావనకూడ నశించును. అహంకార రహితమగుటవలన నిత్యకర్మలు చేయుచున్నను, చేయకున్ననూ, వాటి వలన సాధకునకు ఎట్టి బంధము కలుగదు. అతడె యథార్థ ప్రజ్ఞ అయినాడు పంచకోశములకు భిన్నుడై 'సత్యజ్ఞానానంద స్వరూపుడై బ్రహ్మనిష్ఠయందు స్థిరత్వము నొందిన సాధకునకు, ఇక జనన మరణ భయము

కలుగనే కలుగదు. తన యథార్థ స్వరూపమగు ఆత్మస్థితిని పొందిన వానికి సంకల్ప వికల్పములులేవు.

**బ్రహ్మస్వరూప స్థితి :**

సాధకునకు పరతత్వ బోధలో స్థిరత్వము కలిగినది. ఆత్మ స్వరూపుడైన తనకంటె ఇతరవస్తువేదీ ఇకగోచరింపదు. తాను పరమాద్వైత స్థితిని పొందినాడు. కనుక తనకు బ్రహ్మేతర మెద్దియు స్ఫురింపదు. ఎల్లప్పుడును అధిష్టాన బ్రహ్మము మాత్రమే స్ఫురించుచుండును. ఇదియే జీవన్ముక్తస్థితి.

బ్రహ్మస్వరూపము నిరాకారము. అనగా నామరూపములకు అతీతము. అద్వితీయము. అనంతము. సర్వవ్యాప్తము, సర్వాశ్రయము. పరిపూర్ణము. పరమశాంతము. సాధకుడైన తానే ఆ అఖండ, అద్వితీయ, ఆనందమయుడైన బ్రహ్మస్వరూపుడై విలసిల్లుతున్నాడు. సర్వసమత్వం కలిగి, పరమశాంతుడై, అనుక్షణము తత్వజ్ఞానముతో భాసిల్లుతూ, శోభాయమానుడై విరాజిల్లుతున్నాడు. అతనికిక నేను, నీవు, అది, ఇది అన్న బేధబుద్ధి లేదు అతనికి పరమాత్మ తప్ప మరొకటిలేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్న సత్యానుభూతిని పొందినాడు. పాంచభౌతిక అస్తిత్వము అతనికి వదలిపోయినది. సర్వము ఏకైక సత్య స్వరూపుడైనతానే. "బ్రహ్మ విద్ బ్రహ్మైవభవతి"

అనెడి జ్ఞానరూపములో ఏకత్వము పొందిన పరబ్రహ్మస్వరూపు డైనాడు. జీవాత్మ, పరమాత్మ, మనసు, బుద్ధి, అహంకారము, ఇంద్రియకూటమి, శరీరము, ప్రపంచము అన్నీ ఒకటే. అవన్నీ వట్టి కల్పనలు మాత్రమె. కల్పనలు పరమాత్మకు భిన్నము కాజాలవు. ఉన్నది పరమాత్మ ఒకటే. రెండవది లేనేలేదు. ఇక అభేద భావములకెంత మాత్రము తావులేదు. ఇదియే ఆత్మ జ్ఞానము. సర్వమానవులు ఎప్పుడో ఒకప్పుడు పొందవలసిన దివ్యగమ్యము. ఈ పరతత్వగమ్యమే సర్వమతముల సామరస్యమై వున్నది.

— సమాప్తం —

